





# గేయాలు

పౌరాణిక,జానపద,సామాజిక

# మధుర గేయ కబంధం





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120020442

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# మధుర గేయ కదంబం



పాపగంటి (కలపాల) పుష్పలీల

# ముందుమాట

యం. యస్. శాస్త్రి
బ్లాక్ డెవలప్‌మెంట్ ఆఫీసర్
పంచాయితీ సమితి, మచిలీపట్నం

శ్రీమతి పి. పుష్పలీలగారు బందరు పంచాయతీ సమితిలో ఉపాధ్యాయినిగా పనిచేస్తున్నారు. గేయ రచన చేయటంలో, లయ పద్ధతిలో చిన్న పిల్లలతో పాడించి ప్రదర్శించుటలో ఆసక్తి కలిగినవారు. వీరికి మధుర మైన కంఠస్వరం ప్రసాదించి భగవంతుడు పూవుకు తావి అబ్బినట్లు చేసినాడు. వీరు క్రైస్తవ భక్తి గీతాలు కూడా రచించినారు. రచన ఎట్టిదైనా చదువుటకు ఇంపుగా ఉంటుంది. బాల్యం నుండి పిల్లలకు "పొదుపు" నేర్ప చూపు గేయం సొంపుగా వున్నది. "ఇద్దరుంటే చాలు" కుటుంబనియంత్రణకు సంబంధించిన నృత్య రూపకం ప్రభుత్వ పథకానికి అద్దం. పిల్లల మనస్సులకు ఇంపైన రచనలు మరికొన్ని వీరి కలం నుండి తప్పక కదులుతాయని ఆశిస్తా.

# శుభాకాంక్షలు

' మధురకవి '

ముదిగొండ నాగ మల్లికార్జునరావు

M. A. (Litt)

గ్రేడ్ I తెలుగు పండితుడు

" మధుర గేయాల పన్నీటి మార్గమందు
వినుత జాతీయ పదశైలి వీడబోక "
రచించినట్టిదీ కదంబం

ఇది శ్రీమతి పుష్పలీలగారి తొలి రచనయైనా ప్రతి గేయంలోనూ ఒక వినూత్న భావన కనిపిస్తుంది. ఈ చిన్న పుస్తకంలో ఎన్నో రంగురంగుల పూలు, దర్శనమిస్తాయి. ఈ కదంబాన్ని కూర్చటంలో రచయిత్రిగారు చేసిన పరిశ్రమ అద్వితీయము. మధురత నింపి ఆబాల గోపాలము దీన్ని ఆస్వాదించాలని చేసిన ప్రయత్నం సాటిలేనిది. వారింట ఆమె తయారుచేసిన హేండ్ వర్క్ బొమ్మల్లో కూడా ఒక మధురత్వం కనిపిస్తుంది. ఉపాధ్యాయ వృత్తిలో ఉండి, ఉత్తమ సంగీతజ్ఞురాలైన ఈమె తన గేయాలన్నింటికీ సంగీతాన్ని కూడా జోడించి ఎన్నో సభల్లో, పాఠశాలల్లో పిల్లలచే ప్రదర్శింపజేయటం వారి నిర్మాణాత్మక కృషికి చక్కటి నిదర్శనం. అదొక బొమ్మల కొలువు.

గేయాల గొప్పదనం ఎవరో ఒకరు నిర్ణయించి చెప్పేది కాదు. సహృదయులైన పాఠకులు చేయాల్సిన పని. అది గ్రహిస్తేనే సంస్కృతి ఆ పాఠ మధురం

అవుతుంది. "మీరూ ఒక మాట వ్రాయాలి" అన్న వారి కోరిక కాదనలేకపోయాను. శ్రీమతి పుష్పలీలగారి అభిమానానికి హృదయపూర్వక కృతజ్ఞతలు. ఈ కదంబాన్ని బ్లాక్ డెవలప్‌మెంట్ ఆఫీసరుగారైన శ్రీ యం. యస్. శాస్త్రిగార్కి కృతి ఇవ్వటం కూడా ఎంతో సమంజసంగా ఉంది.

ఎక్కడ మంచి వున్నా, ఎవరు నిర్మాణాత్మకమైన సూచన చేసినా ఆలోచించి అందుకునే సహృదయంగల వీరు ముందు ముందు సామాజిక దృక్పథంతో తమ కవితలను సృష్టించి ఆధునిక నారీలోకంలో ఆదర్శ ఉపాధ్యాయినిగా సెహబాసను రీతి సహృదయాభిమాన, వాత్సల్యాముల బొంది చిరకాలము వర్థిల్లవలెనని కాంక్షిస్తున్నాను. భారతీయ సాంప్రదాయ గౌరవానికి భంగం లేకుండ రసవంతమైన సరళశైలితో సంఘానికి - సాహిత్యానికి గొప్ప సేవ చేయాలన్న వారి సంకల్పం అనల్పం. వీరి కృషి ప్రశంసనీయం. వారికి నా మనోజ్ఞ శుభాకాంక్షలు.

# శుభాకాంక్షలు

' మధురకవి '

ముదిగొండ నాగ మల్లికార్జునరావు

M. A. (Litt)

గ్రేడ్ I తెలుగు పండితుడు

" మధుర గేయాల పన్నిటి మార్గమందు
వినుత జాతీయ పదశైలి వీడబోక "
రచించినట్టిదీ కదంబం

ఇది శ్రీమతి పుష్పలీలగారి తొలి రచనయైనా ప్రతి గేయంలోనూ ఒక వినూత్న భావన కనిపిస్తుంది. ఈ చిన్న పుస్తకంలో ఎన్నో రంగురంగుల పూలు దర్శనమిస్తాయి. ఈ కదంబాన్ని కూర్చటంలో రచయిత్రిగారు చేసిన పరిశ్రమ అద్వితీయము. మధురత నింపి ఆబాల గోపాలము దీన్ని ఆస్వాదించాలని చేసిన ప్రయత్నం సాటిలేనిది. వారింట ఆమె తయారుచేసిన హేండ్ వర్క్ బొమ్మల్లో కూడా ఒక మధురత్వం కనిపిస్తుంది. ఉపాధ్యాయ వృత్తిలో ఉండి, ఉత్తమ సంగీతజ్ఞురాలైన ఈమె తన గేయాలన్నింటికీ సంగీతాన్ని కూడా జోడించి ఎన్నో సభల్లో, పాఠశాలల్లో పిల్లలచే ప్రదర్శింపజేయటం వారి నిర్మాణాత్మక కృషికి చక్కటి నిదర్శనం. అదొక బొమ్మల కొలువు.

గేయాల గొప్పదనం ఎవరో ఒకరు నిర్ణయించి చెప్పేది కాదు. సహృదయులైన పాఠకులు చేయాల్సిన పని. అది గ్రహిస్తేనే సంస్కృతి ఆపాతమధురం

అవుతుంది. "మీరూ ఒక మాట వ్రాయాలి" అన్న వారి కోరిక కాదనలేకపోయాను. శ్రీమతి పుష్పలీలగారి అభిమానానికి హృదయపూర్వక కృతజ్ఞతలు. ఈ కదంబాన్ని బ్లాక్ డెవలప్‌మెంట్ ఆఫీసరుగారైన శ్రీ యం. యస్. శాస్త్రిగారికి కృతి ఇవ్వటం కూడా ఎంతో సమంజసంగా ఉంది.

ఎక్కడ మంచి వున్నా, ఎవరు నిర్మాణాత్మకమైన సూచన చేసినా ఆలోచించి అందుకునే సహృదయంగల వీరు ముందు ముందు సామాజిక దృక్పథంతో తమ కవితలను సృష్టించి ఆధునిక నారీలోకంలో ఆదర్శ ఉపాధ్యాయినిగా సెహబాసను రీతి సహృదయాభిమాన, వాత్సల్యముల బొంది చిరకాలము వర్థిల్లవలెనని కాంక్షిస్తున్నాను. భారతీయ సాంప్రదాయ గౌరవానికి భంగం లేకుండ రసవంతమైన సరళశైలితో సంఘానికి - సాహిత్యానికి గొప్ప సేవ చేయాలన్న వారి సంకల్పం అనల్పం. వీరి కృషి ప్రశంసనీయం. వారికి నా మనోజ్ఞ శుభాకాంక్షలు.

# సహృద్వచనం

'బాలబంధు' బి. వి. నరసింహారావు

Fellow of A. P. Balala Akademi

మల్లెల వంటి హృదయాలున్న పిల్లల కోసం పాటలు అల్లడం అదొక మహత్తర విశేషం.

పాటలో సహజంగా లయగతి ఉంటుంది – త్రిశ్ర, చతురస్ర ఖండ, మిశ్రలలో ఏదైనా ఒకటి. పాటలు అనేవి పాడుకోవడానికి ఉద్దేశింపబడినవి. వాటికి సంగీతాలంకరణ తరువాత సమకూర్చుతాము.

మాత్రా ఛందస్సులో నిబద్ధమై యున్న పాటలకు సహజ సౌభాగ్యం తాళగతి. ఆ గతిని పాడుకుంటూ గాక, మొదట చదువుతుంటూ సరిచూచుకోవడం గేయకారుల తొలి కర్తవ్యం. చూచుకొనకుంటే ఎక్కడైనా ఒకటి అరా మాత్ర తగ్గడమో, హెచ్చడమో జరుగుతుంది.

శ్రీమతి పుష్పలీలగారు మంచి గాయని. పైగా ఆమె బాలలకు విద్య గరపే ఉపాధ్యాయ. ఆమె రచించిన ఈ గేయాల్లో ఎంతో వైవిధ్యం వున్నది. బాలలకు అందే చెందే భాషా సౌరభం, భావ సౌరభం ఉన్నది.

బాలలకై ఆమె ఒక బాలికయై ఈ గేయాలు విరచించారు. అదీ విశేషం. బాలల భావాలు పొందు పరచారు. మరీ విశేషం.

ప్రాథమిక పాఠశాలల్లోని, ఉన్నత పాఠశాలల్లోని బాల బాలికలు ఈ గేయాలను గానలయాత్మకంగా పాడుకొని ఆనందించగలరన్న నమ్మకం నాకున్నది. మంచి గేయాలను కూర్చి శ్రీమతి పుష్పలీలమ్మగారు ఒక గ్రంథంగా వెల్వరించడం బహుదా ప్రశంసనీయ.

ఆమెకు నా హార్దికాభినందనలు.

o o o

# నా మాట

నా యీ అక్షరాల కూర్పుకు ప్రేరణ మా బడిలోని పిల్లలే.

ఆ చిన్నారుల కమ్మని మాటల వెలుగుల్లో ఈ ప్రసూనాలను చిందించాను. వారితో ఆడుతూ పాడుతూ ఉపాధ్యాయినిగా నా ధర్మాన్ని నిర్వహిస్తూ ఇలా తీర్చిన కుసుమాలన్నిటిని పూజ్యులైన మా శ్రీవారి పర్యవేక్షణలో ఒక కదంబంగా తయారుచేశాను. చేయాలనే ఉత్సాహం నాలో కలిగింది. నిజానికి నాకు సాహిత్యమంటే చాలా దూరం. ఎక్కువ గ్రంథాలు చదవకపోయినా, విజ్ఞుల సాహచర్యంలో తెలిసినంతలో సంగీతాన్ని మేళవించి, ఏర్చి కూర్చటం జరిగింది.

అనుకోని విధంగా నా యీ కొన్ని గేయాలను విన్న మా బ్లాక్ డెవలప్‌మెంట్ ఆఫీసరుగారు శ్రీ యం. యస్. శాస్త్రిగారు ఉత్సాహంగా నా యీ కదంబాన్ని ఆసాంతం పరికించడం జరిగింది. నా భావాలకు తగినట్లుగా వారు గేయ సాహిత్యాభిమానం కలవారు కావటమే ఈ గ్రంథం వెలుగులోకి రావటానికి కారణమైనది. ప్రభువుల దర్శనమే ప్రభు దర్శనంగా భావించి, వారికే నా యీ కదంబాన్ని హృదయపూర్వకంగా అంకితమిచ్చాను. వారు నా కోరికకు మన్నించినందుకు ధన్యురాలను.

రచనలోని అక్షర దోషాలను సరిదిద్ది రచించిన పుష్పాలన్నింటిని, వేటికవిగాక ఒక సక్రమ మార్గంలో ఉండేటట్లు ఒక చక్కని మధుర కదంబమాలగా ఏర్పరచిన మధుర కవులు శ్రీ ముదిగొండ నాగమల్లికార్జునరావుగార్కి నా నమః సుమాంజలి సమర్పిస్తున్నాను.

నా యీ కదంబ పథగాములై, జీవిత భాగస్వాములై నిరంతరము శ్రమించి నన్ని సాహితీ లోకంలో రచయిత్రిగా తీర్చిదిద్దిన మా శ్రీవార్కి భక్తి ప్రపత్తులతో అభివందన గావిస్తున్నాను.

మా ప్రార్థన మన్నించి కోరిన వెంటనే తమ అమూల్య అభిప్రాయాన్ని వ్రాసిన 'బాలబంధు' శ్రీ బి. వి. నరసింహారావుగార్కి కృతజ్ఞతాపూర్వక నమస్కారములు తెలియజేయుచున్నాను. నా యీ ప్రయత్నములో తోడ్పడిన సోదర ఉపాధ్యాయులగు శ్రీ ఎస్. జయరావు (ప్రధానోపాధ్యాయులు), శ్రీ వి. హరినారాయణ B.A., శ్రీ జి.వి. సుబ్బారావు (హిందీ పండిట్) మరియు శ్రీ ఆర్. అర్జునుడు గార్లకు కృతజ్ఞతాభివందనములు.

మా కోరిక మన్నించి అతి తక్కువ కాలంలో పుస్తకాన్ని చక్కగా ముద్రింపించి మా కందించిన సహృదయుడు స్పందన ప్రింటర్స్ శ్రీ గుత్తికొండ సుబ్బారావు గార్కి ప్రణామములు.

సహృదయులైన పాఠకులు ఇందలి దోషాలను తెలియజేసిన, తరువాత ముద్రణమున సరిజేసికొనగలనని మనవి జేయుచున్నాను.

— పాపగంటి (కలపాల) పుష్పలీల

# అంకితం



నా తొలి రచనకు కదలిక కల్పించి
సాదరమున వెలుగులోకి తెచ్చిన
మహనీయులు, సశ్శీల సంపన్నులు
శ్రేయోభిలాషి
మా బ్లాక్ డెవలప్‌మెంట్ ఆఫీసరు
**శ్రీ యం. యస్. శాస్త్రి గారికి**
అంజలితో ఈ కదంబాన్ని
సమర్పిస్తున్నాను

— రచయిత్రి

# ఇందులో ఇదీ వరుస

## జాతీయ గీతములు



## అభినయ గీతములు

## కవితలు

# జాతీయ గీతము

( తమసోమా - జ్యోతిర్గమయ )

పల్లవి : భారతదేశం - మనదేశం
భాగ్యం భోగ్యం - మనకోసం
స్వతంత్ర భారత దేశంలో
స్వైర విహారం - చేసెదము ! ॥భారత॥

ఎందరో మహానుభావుల త్యాగం
అందెను యిదిగో స్వతంత్ర ఫలము
ఆహా స్వతంత్ర దినమిదిగో
అ(ల్ల)దిగో అందరి జెండా పండుగ ॥భారత॥

వన్నె వన్నెల పువ్వుల తోట
ఎన్నో జాతులు ఉన్న కోట
శత్రు సమూహం పొంచిన చోట
శరవేగంతో చేసెద వేట ॥భారత॥

నైతిక విలువల భావన పెంచి
నవజీవమునకు నాందిని పల్కి
గాంధీ నెహ్రూ అడుగుజాడల
బుడి బుడి అడుగులు వేసెదమికను ॥భారత॥

# ఏదీ ... మన స్వాతంత్ర్యం ? ...

ఏదీ ... ఎక్కడున్నదీ
అది ఏదీ ... అది ఎక్కడున్నదీ !
స్వాతంత్ర్యం మనకు — ఎక్కడున్నదీ !
ఎందరెందరో - మహానుభావులు
చేశారందరు స్వాతంత్ర్య పోరాటం
గెలిచారు కొందరు — సత్యాగ్రహసమరం
తెచ్చారిదిగో మనకు స్వాతంత్ర్యపీఠం ॥ఏదీ॥
మాటలలో వచ్చింది — కోటపై ఎగిరింది
చదువురాని బాబులకు పదవులెన్నో తెచ్చింది
కాని, కూలి చేయు కన్నెపిల్ల—కట్టుకోను గుడ్డలేక
అతుకు బొతుకు బొంతలాగ —
బ్రతుకులాగుటెందుకని ॥ఏదీ॥
తిన్నవాడికే తిండి - ఉన్నవాడికే కలిమి
అసలు లేని వాడి గతి — ఎసరుపెట్ట కుండ లేదు
ఎంగిలాకు లేరుకుని — ఎంచి, ఎంచి పంచుకొనే
దిక్కులేని ప్రజలకు—డొక్కనిండదెందుకని ॥ఏదీ॥
స్వాతంత్ర్యం వచ్చింది—శాన్నాళ్ళు అయ్యింది
ఏదీ ఎవరొచ్చినా - వెలగబెట్టిందేముందీ
బడుగుజీవులందరికి - గతుకుచున్న బతుకులేగ
స్వాతంత్ర్యపు—సారమిదా? సమభావన లేటయిదా? ॥ఏదీ॥

# స్వాతంత్ర్య రథం

సాగుచున్నదీ – స్వాతంత్ర్య రథము
గణగణమను – గంటలతో
ప్రగతి కాంతి – తొలి వెలుగులతో

॥సాగుచున్నదీ॥

పయనించుచున్నది – ప్రశాంత బాటలో
అశాంతి రేపినా – తుఫాను బాటలో
అధైర్య మొందక – ఆశాజ్యోతితో
నవ నిర్మాతల – రథసారులతో ॥సా॥

పోటి లేనిదిక – దీనికెదురుగ
సాటిరాదు మరి – ఏదిజగమున
ధీటుగ ధాటిగ – నేటి యుగమున
సాగుచుండె నవ – భారత రథము ॥సా॥

సమైక్యతా – సహజీవనము
శాంతి సమరము సాగిపోవగ
కదులుచున్నదీ – కాలచక్రమున
ధర్మ చక్రముతో – స్వతంత్రరథము.

# స్వాతంత్ర్యదినోత్సవ గీతం

స్వతంత్ర దేశం మా దేశం
సగర్వమైనది - మా దేశం
భారత దేశం - మా దేశం
భారతీయులది - ఈ దేశం ॥స్వతంత్ర॥

శాంతి సమానత గల దేశం
కాంతి ప్రదాతల గల దేశం
గాంధీ నెహ్రూ బోసుల గన్న
భారత దేశం ఈ దేశం ॥స్వతంత్ర॥

హిందూ, ముస్లిం, క్రైస్తవులు
అందరు మెచ్చిన ఈ దేశం
మతాలు వేరైనా అ అ అ. ...
కులాలు వేరైనా... అ అ అ...
మా పదముల నడక- ఒకటే గనుక ॥స్వతంత్ర॥

పంచ నదులతో - జీవనదులుగా
పాడి పంటలకు - నిలయమైనది
తెలుగు వెలుగుతో - దివ్యతేజమై
ప్రపంచ ఖ్యాతిని - పొందిన దేశం ॥స్వతంత్ర॥

# ఇందిరమ్మ

తల్లిలేని పిల్లలకు
ధరణి భారము
అమ్మ లేని జన్మభూమి
కంత భారము. ॥త॥

కన్నులకు వెలుగైనది
కన్నతల్లిరా...
భరత మాత- ముద్దుబిడ్డ
ఇందిరమ్మరా... ॥త॥

కన్నతల్లివలెను మనల
గారవించెరా...
వీరనారి ప్రియదర్శిని
యికను లేదురా... ॥త॥

అమ్మలేని భారతమ్మ
చింత నొందెరా...
ఆరని జ్యోతి యిలలో
అమర్ రహే హై. ॥త॥

# అందరం ఒక్కటే

పల్లవి : అందరం మనమందరం అన్నదమ్ములం
అందరం మనమందరం భారతీయులం

కులాలు వేరైనా - మన మతాలు వేరైనా
వేషం ఏదైనా - మన భాషలు వేరైనా
అందరి జీవన మొకటే కాదా ॥అం॥

నదులు వేరైనా - వాటి నామమువేరైనా
జలములు వేరైనా - జలరాసులు వేరైనా
అందు పారుచున్నది - నీరే నిజముగ ॥అం॥

పూలు వేరైనా - పూ జాతులు వేరైనా
రంగులు వేరైనా - వాటి హంగులు వేరైనా
అన్ని పువ్వుల మకరంద మొకటే ॥అం॥

# డా॥ సర్వేపల్లి రాధాకృష్ణుని జన్మ దినోత్సవ గీతం

పల్లవి : పండిత రాధాకృష్ణుని
పుట్టినరోజు- ఈ రోజు- ఈ రోజు ॥పం॥

ప్రపంచ ఖ్యాతి గడించిన
పండితు డితడే
బహుముఖ ప్రజ్ఞాశాలి
పుణ్యచరితుడు- మన భారతీయుడు ॥పం॥

సెప్టెంబరు ఐదు యిదే
ఉపాధ్యాయ దినం (2)
పండిత రాధాకృష్ణుని జన్మదినం
యిదే మహా దినం... ॥పం॥

ఆధ్యాత్మిక విలువ నెరిగి
సత్యాన్వేషణము జేసి
అందించెను- లోకమున
తత్వ శాస్త్ర- జ్ఞానమును
పండితు డితడే- రాధాకృష్ణు డితడే ॥పం॥

సహనం త్యాగం- సర్వేపల్లి గుణములు
సహ జీవన- స్వాతంత్రమె తన ధన నిధులు
విద్యార్థుల కాదర్శుడు
ఉపాధ్యాయ గురు వితడే
ఇతడే- యితడే- పండిత రాధాకృష్ణుడు ॥పండిత॥

సకల దేశ నేతలతో
సరి తూగిన మహా ఘనుడు
సర్వ మానవాళి కి దే
గురు పూజోత్సవ దినం (2) ... ॥పండిత॥

# రిపబ్లిక్ డే

( స్వతంత్రమా ! నీ వయస్సెంత ? )

వచ్చిందదండోయ్ – వచ్చింది
రిపబ్లిక్ డే – వచ్చింది
వచ్చిందీ ... ఇచ్చిందీ
పూర్ణం స్వతంత్రం – తెచ్చిందీ ॥వచ్చి॥

స్వతంత్రమా – నీ వయస్సెంత ?
ముప్పదిఏడు – వర్షములా ?
వయసుపెరిగినా – మనసు పెరగదు
సమతామమతా – పెరగవెందుకు ॥వచ్చి॥

మహానుభావుల – ఆశయాలను
మడుగునదాచి – మంటగలపకు
మానవసేవే – మహాయాగము
మరువకచేయుము – జీవనయానము ॥వచ్చి

మాటలేనా ? నీ తలవ్రాతలేనా !
బాసలేనా లేక వాస్తవమేనా !
వస్తున్నావు పోతున్నావు పాపం
నీకేంతెల్సు – మేం పడే పాట్లు ॥వచ్చి॥

# బాలల విజ్ఞప్తి

పల్లవి : గురువర్యా విన్నావా - ఓ గురుదేవా విన్నావా !
గురువర్యా విన్నావా - ఓ గురుదేవా విన్నావా !

ముక్కుపచ్చలారని - పసిపాపలం మేము
పాలుత్రాగే మాకు - పాఠాలు రావండి
పదిలంగ చెప్పండి - పండితుల చేయండి ॥గురు॥

అమ్మ నాన్నను వదలి - చేరితిమి మీ దరికి
విసురుకోక కసురుకోక - బుజ్జగించి మమ్ములను
శ్రద్ధగాను చెప్పండి - చదువునూ నేర్పండి ॥గురు॥

ఆటలనగ పాటలనగ - ఆనంద మౌనండి
చదువు మీద శ్రద్ధ మాకు - చాల తక్కువేనండి
ఆటపాట నేర్పండి - ఆనందం చేయండి ॥గురు॥

శ్రమనగ తెలియని - చిన్న పిల్లలం మేము
మా భావి జీవితపు - మొదటి మెట్టు మీరండి
భరత దేశ భక్తులైన - పౌరులుగ మార్చండి ॥గురు॥

# జాతీయ జెండా గీతం

పల్లవి :   ఎగరాలి - ఎగరాలి - జాతీయ జెండా
ఎగరాలి - ఎగరాలి - జాతీయ జెండా !
త్రివర్ణ జెండా ! - స్వాతంత్ర జెండా

మూడు రంగుల జెండ - ముచ్చటైనా జెండా !
ధర్మచక్రముతోటి - ధరణిపై వెలసింది

భరత వీర పుత్రులందరు - విక్రయించిన ప్రాణధనమది
ఎగురుచున్నది అంబరమున - నేడు మనకది సంబరముగ

శ్వేతజాతిని తరిమికొట్టి - శాంతిసమరమునందు గెల్చి
ఎగురుచున్నది జాతి చిహ్నము -
వెలుగుచూపుచు ముందు మనకు.

# విరబూచే పూలు

(సీతాకోక చిలుకలం)

పల్లవి :- సీతాకోక చిలుకలం
చిన్నారి పిల్లలం
విప్పారని మొగ్గలం
విరబూసే పువ్వులం ॥ సీతా ॥

రంగు రంగుల తావులం
వన్నె వన్నెల పూవులం
మల్లె మందారులం
చెండూ చేమంతులం ॥ సీతా ॥

మల్లెపూవు మనసులం
తెల్ల గులాబులం
ఒక్క తల్లి పిల్లలం
భరతమాత పూతలం ॥ సీతా ॥

తేనె పట్టు ఈగలం
మకరందం నింపుతాం
దేశభక్తి నిలుపుతాం
ఐక్యముగా మెలుగుతాం. ॥ సీతా ॥

రాకెట్టులో రాకేష్‌తో
చంద్రలోక మేగుతాం
భూమి చుట్టు తిరుగుతాం
తిరిగి భూమి చేరుతాం ॥ సీతా ॥

తెలుగు వెలుగు నింపుతాం
దేశమంత చాటుతాం
కీర్తి మేము పొందుతాం
కిల కిల మని నవ్వుతాం ॥ సీతా ॥

# ఊహాగానం

పల్లవి : పైనెగిరే పక్షుల్లారా - ఆగండి మీ రాగండి
ఎందాక మీరెళ్ళేది - అందాకా నేను వస్తా ॥పై॥

పాటుపడే పని లేదాయె - సాపాటు పని మీకసలే లేదు
భగవంతుని దయలో మీరు-బ్రతికెదరు బలేవింతగ ॥పై॥

అందం చిందె మేఘములందె - మాకు దూరమైనుండెదరె
మీతో స్నేహం చెయ్యాలంటె - నాకు రెక్కలు కావాలి
మీతో ఎగిరి **రావాలి.** ॥పై॥

ఎగరాలంటె రెక్కలు లేవు - ఎట్లా మీతో రావాలి
అన్నట్లదిగో రాకెట్టు - ఆటుగా ఎగిరీ పోతుందీ
చెయెత్తాటండాక నిమిషం - చిట్టిచెల్లికి చెప్పొస్తా ॥పై॥

అమ్మ నాన్నని అడిగొస్తాను - మిఠాయి పొట్లం తెచ్చేస్తాను
రాకెట్టెక్కి రయ్యిన ఎగిరి - చంద్రమండలం
ఎక్కేద్దాం - జెండా ఒకటి పాతేద్దాం. ॥పై॥

# చిట్టి చెల్లాయి అల్లరి

పల్లవి : అమ్మా అమ్మా చూడవె - చిట్టి చెల్లి చూడవే
చీటికి మాటికి పేచి పెట్టి- చిరాకు పడుతుందీ
అబ్బ... గోల చేస్తుందీ...చూడె ||అమ్మా||

ఇంట్లో పెత్తన మంతా తనదని - కస్రేపడుతుందీ-నన్నె
కొట్టి వస్తుందీ-అందక నేను అటుగాపోతే కేర్
మంటుందీ- పంతం పట్టి దగ్గరకొచ్చి-
దెబ్బలు తినమందీ- చూడే ||అమ్మా||

నాన్న తెచ్చిన మిఠాయి పొట్లం - తనకే నంటుందీ
అంతా తనదే నంటుందీ -చిట్టీ, బుజ్జీ కొంచెం నాకని భిక్షం
అడిగిననూ - ఆ ... వుహూ - అంటు పొట్లం చేత
పట్టుకుపోయిందీ-నాన్నభుజమేఎక్కిందీ చూడె ||అమ్మా||

వచ్చీరాని మాటలు జెప్పి- వళ్ళో వాలిందీ-
అమ్మని వలలో
వేసిందీ- నేరం చెయ్యని - నాపై అమ్మే తప్పే
మోపిందీ - సిరులొలికించే చిట్టీ చెల్లీ అమ్మను గెలి
చిందీ- చివరకు నన్నోడించిందీ న్యాయం. ||అమ్మా||

# రైలు బండి ఆట

చిక్, చిక్, చిక్ - చిక్ రైలుబండి - చక చక పోతోందీ
ఆడే పాడే పిల్లల్లారా - గబ గబ రారండీ
ఆడే పాడే పిల్లల్లారా - అందరు రారండి ॥చిక్॥

వన్ బై వన్ వరుసలో - చక్కాగ నిల్వండీ
ఒకటో వాడే యింజనండి - రెండు, మూడు డబ్బాలు
వెనుకను ఒకరు ఉన్నాడండీ - అతనే గార్డ్ మాన్ ॥చిక్॥

ఆగిందండీ స్టేషన్‌లో - అందరు ఎక్కాండీ
టిక్కెట్టు లేకుండ మీరు - బండినెప్పుడు ఎక్కొద్దు
పచ్చజెండా చూపకముందే - పరుగున రారండీ
బండిని బాగా ఎక్కండీ ... ॥చిక్॥

వెళ్ళేటప్పుడు బండినెపుడు - ఎక్కావద్దండీ
ఎంతో దూరం పోతుందండీ - ప్యాసింజరుబండి
చిన్నాపెద్దా అందరు ఎక్కి - ఆనందించండీ
బండిలో హాయిగ నుండండి ॥చిక్॥

# కలము - హలము

పల్లవి : కలము - హలము రెండు ఒకటే
మానవకోటికి - జీవన మొసగె ॥ కలము ॥

కార్మికులైన కర్షకులైన
పండితులైన - పామరులైన - కాదనగలరా-
ఎవరైనా ఇది.
కాదనగలరా ఎవరైనా... ॥ కలము ॥

కలమును పట్టు - పండితుడౌకడు
హలమును పట్టు - పామరు డౌకడు
కలమైనా - హలమైనా మేటి
విద్యలకు - మానవుడౌకడె ॥ కలము ॥

కలముపైన అధికార మొకరిది
హలముపైన - అధికార మొకరికీ
కలము హలము - కలియక చేత
కాల చక్రమే - కదలుచు నుండె... ॥ కలము ॥

కలము నుండి గడియించును ఘనము
హలము నుండి లభియించును ధనము
ఘనము, ధనము మనిషికి ఒకటే
ధీరునికి ప్రతి గడియా ఒకటే ॥ కలము ॥

వ్రాసే కలము - ఆగిపోయినా
దున్నె హలము - నిలచిపోయినా,
ఇరువురి పథములు ఒకటైపోయిన
ఆగిపోవునిటు - జగముల నడక ॥ కలము ॥

# బడియాడు

బుంగమూతి బుజ్జోడ
బుడి బుడి అడుగులవాడ
బడికిరార బుల్లోడ
బడియాడు గలవాడ

అమ్మనాన్నల తోటి
ఆటలింక చాలించు
ఆడుకొందువుగాని
ఆ బాల బాలికలతో

ఆడుకొనే టందుకు
ఎందరో ఉందురందు
అచటనే ఎంచుకొనుము
నచ్చిన చెలికాని నీవు

బ్రతుకు బాట నందున
పూలబాట బడియేగా
పూజించుము గురుదేవుల
ముందుగా బడినందున.

# చదువు విలువ

బడికి రా చిన్నయ్యా
బడికి రావయ్యా !
బడినందె బంగారు
గని ఉన్నదీ - విజ్ఞానం
దాగున్న నిధులున్నవీ !

నీ జీవిత బాట కదీ
వెలుగు బాటే బడి
ఆ బాటే విడచినా
చీకటే నీ గతీ !
అందుకే - పొందుకో
బడినందు - చేరుకో !

చదువురాని నిన్ను జూచి
వింతపశువు అంటారు
చదువేరా నీకు ముందు
అందమూ చందమూ
ఆ విలువ తెలియు నీకు
భావికాల మందునా !

కలము బట్టిన నీవు
కళకళ లాడెదవుగా
హలము బట్టిననాడు
వెలవెలా బోదువుగా
కష్టంలో కన్నీరు దాగుండును
సుఖములో కన్నులకు వెలుగుండును
ఆ విద్యను పొంద నేడు రా చిన్నయ్యా
బడికి రా చిన్నయ్యా
బడికి రావయ్యా !

# ఊహల బాల

పల్లవి : అమ్మ నాకు కమ్మనైన పాలనివ్వవే
అంతకన్న మధురమైన ముద్దులివ్వవే

చల్లనైన నీదు ఒడిని చేరనివ్వవే
చక్కనైన కథలు నాకు చెప్పరాదటే ॥అమ్మ॥

చుక్కల్లో చందురుడు చిక్కడెందుకే
ఒక్కసారి అతనితోటి ఆడుకొందునే ॥అమ్మ॥

నన్ను చూచి మబ్బుల్లో – దాగునెందుకే
దాగి దాగి దొంగవలె – నవ్వునెందుకే ॥అమ్మ॥

చుక్కలన్ని చుట్టు చేరి ఉన్నవెందుకే
చక్కనైన చంద్రునిలో – మచ్చ ఏమిటి నల్లని
మచ్చ లేమిటి ? ॥అమ్మ॥

## బ్రహ్మపురమునందు ప్రాథమికోన్నత పాఠశాల ప్రారంభ దినమునకు రచించిన వందన సమర్పణ

సాకీ: ఈ దివం – మహా దినం
మనకందరికీ – మహోత్సవం
బడి కీ రోజు – ప్రారంభోత్సవం

గీత: అందరికీ వందనము - పెద్దలందరికీ వందనముల్
తనిఖీదారు డి. యి. ఒ. గారికి వందనమూ
పిన్నలు పెద్దలు అందరికీ–మరియొకసారి వందవముల్

... బుర్రకథ రీతి ...

పంపండయా బాబు – పంపండయా
బడికి పిల్లల బాగ – పంపండయా ॥పంపండ॥

కష్టమనుకోకుండ – కడు ఓరిమిని జూపి
పలుమార్లు తిరుగుచు - ప్రాధేయపడుచు
ప్రాథమిక స్థాయినె - పై స్థాయి చేయగ
పూనుకొనిరి పెద్దలు - పుణ్యాత్ములెందరొ ॥పంపండ॥

అధికార మండలికి - ఆశయంబును దెల్పి
చిరకాలమందునె - ఘనకార్యమును జేసి
సాధించిరయ్యలె – అప్పరు ప్రయిమరు
ఈ నాటి ఈ వెలుగు - ఎందరినొ వెలిగింప ॥పంపండ॥

కోరినంతనె కోర్కె - త్రోసివేయక ప్రభులు
అధికారులందరు - ఆలోచనలు జేసి
అనుగ్రహించిరి వరము - ధర్మపాలకులు
అందులకు మా హృదయ-దండంబులివియే ॥పంపండ॥

చేసిన పూజలె ఫలియించె నన్నట్లు
వచ్చె నిదిగో నేడు - ఆ మహాదినము
ఆబాల గోపాల - ఆనంద మొందగ
ఇట్లు పొగడగ వేయి - నోళ్ళైన చాలునా ॥పంపండ॥

కడుపు కోసమె కల్గె - కోటి విద్యలు మనకు
కడుపు నింపెడి విద్య - కాష్టమునకే చేరు
అందొక్క విద్యయే - అజ్ఞానమున్ బాపు
ఆదియె చదువులతల్లి - సరస్వతీదేవి ॥పంపండ॥

అట్టి విద్యను నేర్వ - ఆనాటి మనుజుడు
గురుకులములకునేగి - గురుపూజలన్ జేసి
భక్తిశ్రద్ధలతోటి - పాదముల్ పూజించి
బడిసిరే విద్యను - బహు భారముగను ॥పంపండ॥

ఆనాటి కథలలో - కనువిప్పు కలిగేది
ఏకలవ్యుని గాథ - నెరిగింతు నొకమారు
అగ్రగణ్యుడు ద్రోణ - బ్రాహ్మణోత్తముని
అర్థించె విద్యకై - ఆనాడతండు ॥పంపండ॥

"హీనకులము నీది విద్య నేర్పను" అనగ
ఆతని బొమ్మను జేసి - భక్తితో పూజించి
గురువు లేకయె గొప్ప - విలువిద్య నేర్చెగా
గురుదక్షిణము నిచ్చి - గుణశీలుడయ్యెను. ॥పంపండ॥

అంత దూరమునున్న - ఆ విద్య నేడు
ఇంత చేరువుకాగ - నెంత ఆశ్చర్యము
పిల్లలను పెద్దలను - పిలచుచున్నది నేడు
ప్రథమ సోపానమగు - ప్రాథమిక విద్యయే

విద్యలేనివాడు వింత పశువనుమాట
వినరాదు కనరాదు - ఇక ముందు మనము
ఆడ మగ తేడాలు - అనకుండ మీరు
అక్షరాశ్యులు కండి - ఆనంద మొందగ ! ॥పంపండ॥

# పొదుపు

బాలల్లారా – విన్నారా
బాలికలారా - విన్నారా !
వినకుంటే - మరి యీ మాట
చెబుతా విను మరి - నా మాట ॥బాల॥

జగత్తునందు - సృష్టియనంత
దేవుడు చేసెను - ఒకనాడు
అందులో మానవుడే - మహనీయుడు
మరువకు ఎప్పుడు – ఈ మాట ॥బాల॥

మానవుడు జీవించుట - కొరకు
కావలెనెన్నో – వస్తువులు
అందులో ముఖ్యమైనవి - మనకు
ధనము, ధాన్యము - లౌను గదా ! ॥బాల॥

కష్టించి పని చేసిన నీకు
కలుగును ధనము ధాన్యమును
ధనమె నీకు ఆనందం, ఆరోగ్యం
నిచ్చేది – ఔషధము ॥బాల॥

తినుచు, త్రాగుచు – సంతోషములో
రేపటి రోజు - మరువద్దు
సంపాదించిన – ధనములో కొంత
దాచిన అదియే - పదివేలగును ॥బాల॥

పల్లవి

దాచిన సొమ్ముకు దొంగల భయము
లేకుండా - ఉండాలంటె
ఇదిగో - బేంకి, అది పోష్టాఫీసు
ఎందులొ దాచిన - పొదుపగును ॥బాల॥

పక్షమునకు రూపాయి చొప్పున
దాచుము బాంకిలొ – ఈనాడె
రేపటి రోజున – లెక్కకు మించి
అవసరములను – తీర్చును నీకు ॥బాల॥

# మేల్కొలుపు

(నృత్యగేయం)

పల్లవి : లేవోయి కార్మికుడా - లే...లేవోయి కార్మికుడా !
నిదుర...నిదుర లేవోయి కార్మికుడా - నిదుర
లేవోయి కార్మికుడా !

కళ్ళు తెరచి చూడరా ... ఆ కళ్ళల్లో నీరెందుకు
కాలమెంతో ముందు - కలసి వస్తుందోయి
కష్టాలు నిన్నెపుడు - కదిలింపలేవోయీ ॥లేవోయి॥

పరులకు సాయం చేయ - శ్రమదానం చేయుము
బ్రతుకులోని సగభాగం - అదే నిజం తెల్సుకో
తోటివారి బ్రతుకులో - తోడ్పడుటే ధర్మము
అది వీడిన నీ వెంటనే - తోడగు నీ ఖర్మము ॥లేవోయి॥

బ్రతుకంత భారంబని — తలపోయకు
భరతమాత - బిడ్డవని మరచిపోకు
బంగరు పండే భువిలో - భాగ్యమే తక్కువ !
భాగ్యం భోగ్యం నీదే - భావికాలమందున ॥లేవోయి॥

# మేమూ మనుషులమే
(ఫోక్-డాన్స్)

పల్లవి : కూలోళ్ళ మయ్య బాబూ ...
కూటికి లేనోళ్ళమయ్య మేము
మా గోడు వింటుంటె
మీ కన్న - దయ రాదా !

మీలాంటి వాళ్ళమే మేము ...
అయినా మా తల రాతలు వేరు ...
అయ్యా ... బాబూ ...
ఉన్నట్టే ఉన్నాయి - తిరగబడి పోయినాయి
బతుకంతా శమటతో
బతకమనీ ఉన్నాయి ... అ ... అ ... అ ... అ
॥కూలోళ్ళ॥

బ్రహ్మ రాశాడేమొ మీకు
మరి, ఏ బ్రహ్మ రాశాడో మాకు
రాజు యనీ – పేద యనీ
ధనికులూ – దరిద్రులని
కర కర మని రాసేసి
గిర గిర మని తిప్పేసి
భూమి మీద - పడవేసె ॥కూలోళ్ళ॥

కారుల్లో - తిరుగుతుంటె
కష్టమెలా - తెలిసేది ?
పాను కింద - కూకుంటె
చమట ఎలా - పట్టేది
పెట్టెల్లో పట్టుగుడ్డ
చిమ్మెటలే - కొడుతుంటే... అ. అ.. అ.. అ..
చిరుగు పాత - గుడ్డకైన
నోచుకోని - మా బతుకు ॥కూలోళ్ళ॥

ఎండవక - వానవక
కాయ కష్టం చేసి
రెక్కలన్ని - విరుచుకొని
రాళ్ళనే - కరిగించి
రాజనాలు - పండించి
రాసులనే అందించి
తీరా తిందామంటే
కల్లంలో - రాళ్ళేగా - అ... అ.. అ.. అ.
ఏటికి ఎదురీదినా
ఏతాము బతుకేగా ॥కూలోళ్ళ॥

# ముందుచూపు

అత్తయింటి ఓ
కొత్తకోడళ్లారా !
లేవండి యిక నిద్ర
లేపండి మీరు
నడవండి యిక
నడుం కట్టి మరి
ఉన్న చోటనే ఉండక
మండు మంటలకు
నిండు ప్రాణాలను
బలి చేసి బ్రతుకు
ఆహుతి కాకండి.

మసి గప్పి మానవత్వం
నశించి నైతికత్వం
వహించి రాక్షసత్వం
"అత్త" నెత్తురే కావాలని
అధర్మంగా కొడుకుని
పురిగొల్పి రెచ్చగొడితే,
ఓర్పును వహించక
కోర్టు వార్కి చెప్పుకో !

అర్థాంగి వని తెలిసి
భాగస్వామి వని మరచి
అంధుడై, అధముడై
అవినీతికి పాల్పడి
అంగడిలోని బొమ్మవని
ఆటలాడిస్తే,
ఒప్పుకోకు
ముప్పు తెచ్చుకోకు
కిరసనాయిలు పోస్తారని
కిరాతకాలు చేస్తారని
విన్నావు కన్నావు
అందుకు నీవే ముందుగ
స్పృహతో మేల్కొను
స్వార్థ తంత్రాన్ని
మంత్ర దండంతో
నిశ్చల దీక్షతో
భేదించి, ఛేదించు.

# స్వార్థం

స్వార్థం - స్వార్థం - స్వార్థం
నీ రూపమే - కురూపి వేషం
నిను జూస్తేనే - నాకు మహా కోపం
నీ ఛాయలే - నాకు హేయం

చేస్తావు నేస్తం - కానీ ఏం లాభం
నిముషములో - చేస్తావు మోసం
నిస్వార్థమే అంటావు - నీ జీవితం
కానీ క్షణమైనా - నిలువదు నీ వాగ్దానం

అందుకే అంటున్నా "స్వార్థం పాపం"
అయితే అందుకే ముందుగ
అడగనా ఒక ప్రశ్న !
స్వార్థం లేనిది ఎవరంటా ?
స్వార్థం కానిది ఏదంటా ?
అన్నం తినుట స్వార్థం కాదా !
వస్త్రం కట్టిన స్వార్థం లేదా !

కాదు కాదు - అది స్వార్థం కానే కాదు
అన్న వస్త్రములు - అవసరమైనవి
అవి లేనిదే - మానవ మనుగడే లేదు
అందుకు నీవు అవివేకముగా
అనరాదని స్వార్థము లనుచు

అవునూ అది నిజమే ననుకో
అయినా నా జోలి నీ కెందుకంటూ

అందుకే అంటున్నా - అనుభవంతో చెబుతున్నా
స్వార్థంలోనిది ఇంతో ఎంతో - కొంతైనా
తోటివారి కిల - సాయపడనిచో.

# పంతులయ్యాకు పరీక్ష

చాలీ, చాలని బ్రతుకు
సాగరము నీదుచు
అలల తాకిడి వలన
ఆయాస పడుచు
ఈదుచుంటిని బ్రతుకు
బడి పంతులయ్యగ.

ఇంతలోనె రేగె
నెంతో పెనుగాలీ ?
ప్రాయుమనుచు వచ్చె
ప్రమోషన్ పరీక్ష.
పంచేంద్రియముల
పట్టుతప్పుచుండిన నేను
ఈ పెనుభూత మహమ్మారి
కోరలలో పడకుండ
చేర గలనా ఒడ్డు
ఈ గడ్డు పరీక్షలో ! —

# అడగనా! అమ్మమ్మా ప్రశ్నలు ?

కళ్ళజోడు నుంచి
కనిపించకున్నను
కళ్ళు పెద్దవి జేసి
కంగారు పడుచు
కాళ్ళారజాపుకొని
కునికిల్లు పడుతు
చదువుతూ పుటలన్ని
తిరగ బెడుతున్నావు
తప్ప రెప్పల తోటి
చూస్తూ మూస్తూ!
చదువుకుంటున్నావు
వచ్చిందో, రాలేదో
ఒక్కటైనా నీకు
అప్పజెప్పమ్మమ్మా
అడగనా ప్రశ్నలూ ?

# అమ్మకి చదువు - ఆకలి నాకు

అన్నమేదే యమ్మ - టిఫిన్ కారియర్లో
బడి కెట్టపోదునే - బోజనము లేక ?

ఏం చెయ్యాను తల్లి - చదువుకొంటున్నాను
ఈ రోజు కెట్టనో - ఉపవాస ముండిరా !

# కవిత

ధర్మం మరచి - ఖర్మను జేసి
కోట్లు కలిగినా - కూటికి లేదని
స్వార్ధపు నిధులు - పెంచినాడు
సమానతెక్కడ - సౌజన్యమెక్కడ ?
నిస్వార్ధపు బ్రతుకు - నిస్సారమేగ
సజీవమైన ప్రత్యక్ష - సమాధులేగా !

# నా మనవి

విద్య సాధన చేయ - విద్యార్థులే గద
విద్య గరిపి పెద్దలు - వర్ధించుపెట్లు,
పెద్దలందరు మమ్ము - మొద్దులుగ నెంచిగద
వృద్ధులకు బెట్టిరే - గట్టి గరుడ సాధనము !

కళ్ళ దృష్టియు తగ్గి - కాలి సత్తువ లుడిగె
కాటి కేగు మమ్ము - కలమును బట్టించి
కారాలు మీరాలు - జాతీయ నుడికారాలు
నూరారు మాపైన - నైతిక విలువలే మరచి

ఏది ఏమైనను - లేఖనము తప్పల
అధ్యయన అభ్యసన - కృత్యాల ఫలమును
పొందుపరచితి మిందు - పత్రాలనందు
అందుకొని మీరలు - అవగాహనమున
దిద్దు మమ్ముల నింక - తీర్చదిద్దగరయ్యా !

# పొగ త్రాగరాదు

“ పొగ త్రాగరాదను”చు
పెద్దక్షరాలలో, వ్రాశారు
పాపం, శ్రేయోభిలాషులు.

కాని, చెవులుండి విన్నదా !
నోరుండి చెప్పునా ?
నేను కాదు బాబు
ధూమ పానం చేయ
నా మీద నెపమేల
నే మోయు మీరేగ
ధూమపానము జేసి
ఎదుట వారిని మరచి
పాడు పొగని ఊది
ప్రాణ సంకటము జేసి
మానవత్వం మరచేది
మీరు కాదా యని ?

# అగ్ని తుఫాన్

( దైవోగ్రత )

పల్లవి :- ఈ విధి ఇటులా - జరిగెను ఎటులా !
వివరింపగ నా - తరమా ఎటులా !
ఆహా దైవమె - రోషము జూపెనా
దోషము వలన - ఈ మనుజులపైన ॥ఈ విధి॥

జనములు ఎంతో - నెమ్మది నుండ
చల్లగ సాగెను - సన్నని జల్లులు
పిల్ల గాలులే - మెల్లగ వీచుచు
కడకు మారెను - ఘోర తుఫానుగ ॥ఈ విధి॥

హోరు గాలులు - భీతిని గొల్ప
జోరున వర్షము ధారలు కురియ
కంటికి మిన్ను - కనబడకుండ
కారుచీకటులు - క్రమ్మెను నాడు ॥ఈ విధి॥

చెదరిన హృదయం - కూడగట్టుకొని
బెదరిన మదితో - దేవుని తలచుచు
ఆలు బిడ్డలతో - ఆ వడి రేయిన
ఆక్రోశించిరి - ఆ జలమయమున ॥ఈ విధి॥

రేపటి రోజు తనదే ననుకొనీ
ఎంతో ఆశతో - దాచెను ధనము
కానీ లేదే - జీవము రేపు
కలసి పోయెనే - కన్నీటి తోనే ॥ఈ విధి॥

అనుకొనలేదే - ఆ కడు వింతను
కని విని ఎరుగరె - ఆ జనులంత
రెప్పపాటులో - రేగిన అలలే
జల ప్రళయముగ - మారిన ఈ విధి ॥ఈ విధి॥

అశుభము శుభము - ఎఱుగని బిడ్డలు
పాలు త్రాగు పసిపాప లెందరో
జాలిగ చూచుచు - మాతృమూర్తినే
జారిపోయి రెటో - కన్నీటి కథలో ॥ఈ విధి॥

భీకరమగు - ఆ పెనుతుఫానుకు
సృష్టిచరాలకు - భీతి కల్గెను
అదిరెను లోకము - కరిగెను గుండెలె
కాల మహిమనిటు - కనుగొనె దెటులా ? ॥ఈ విధి॥

పెద్దలు పిన్నలు పడుచు కన్నియలు
గొడ్డు గోదలు - ధనము ధాన్యము
సర్వము సాగెను సాగరమునకు
చేయున దేది - చరిత్ర మిగిలినది ॥ఈ విధి॥

# షాపింగ్ షాపింగు

(సంగీత నృత్య రూపకం)

వచనము : అది ఒక పేదవాని ఇల్లు. భార్య - రంగమ్మ. అతనికి నలుగురు పిల్లలు. చాలీచాలని బతుకు వారిది. అయినా నాగరికత పెరుగుచున్న ఈనాడు, తిన్నా తినకపోయినా, పిల్లల నైనా చదివించి, ఎంతో కొంత విద్య చెప్పించాలను ఆశతో కాన్వెంటుకు పంపుతారు. నలుగురు పిల్లలకు సరైన తిండీ, గుడ్డ ఇవ్వలేరు సరికదా, భార్యభర్తలు, ఒకరోజైనా విశ్రాంతిగా కూచొని కబుర్లు చెప్పుకొనేందుకు వీలుకాదు. రంగయ్య పొలం పనికి, రంగమ్మ ఇంటిపనికి బందీలుగా మారి వుంటారు.

ఒక దినం రంగమ్మ వాకిలి తుడిచి, చందముగ్గు పెడ్తూ వుంటుంది. ఆ సమయములో హుషారుగా వున్న రంగయ్య గంతులేస్తూ వస్తూనే రంగమ్మని ఇలా లాలవగా పిలుస్తాడు.

ప్రారంభం-మ్యూజిక్ : తదిం - ధణకు - జణ, జణా.

మగ : వచనం : ఓ లమ్మీ రంగమ్మా ? ఎంజేత్తన్నావే ? ఎప్పుడూ పనేనా ?

ఆడ : (వ) : ఏందయ్యోయ్! యియ్యాల మాజోరుగుండావు?

మగ : ఏందో సెప్పుకో సూద్దాం, మరి !

ఆడ : అబ్బో నువ్వు సెప్పందె నాకెట్ట తెలుస్తదీ. అదేదో నువ్వే సెప్పు మావా ?

మ్యూజిక్ :

మగ (పాట) : ఓ లమ్మీ, రంగమ్మా - సిల్మాకి ఎల్దాము !
ఓలమ్మీ, రంగమ్మా - సిల్మాకి ఎల్దాము !
ఈడుగ నాతోటి - జోడుగ నాతోటి (2)
రాయే, ఓలమ్మి రంగమ్మా-జంటగ పోదావె
రంగమ్మో - రాయె సిల్మా చూసొద్దాము
రంగమ్మా। (2)

ఆడ (వ) : ఊ...ఏటీ...సిల్మాకా !

మ్యూజిక్ :

రంగమ్మ : ( దిగులుగ కూర్చొని ఆలోచించుచుండును. )

మగ (వ) : ఏందసే — సిల్మా కెల్దామంటే గట్టా దిగులు బోతావ్...కూకొనీ !

ఆడ (పా) : ఓ రయ్యో ! మావయ్య-ఎట్టాగు రానయ్యా
ఓ రయ్యో ! మావయ్య-ఎట్టాగు రావయ్య
ఎడపిల్ల ఏడుపాయె-చంటిపిల్ల పాలకాయె
కాన్మెంటు పిల్లలింక-కొంపకే రారయ్యో
ఎట్టాగ వచ్చేది మావయ్య-సిల్మా ఎట్టా
చూసొద్దాము-సెప్పవయ్యా ! (2)

మగ (వ) : అందుకేగా సెప్పింది మరీ ? ఇద్దరు పిల్లలుంటే చాలనీ...

ఆడ (వ) : ముగ్గురూ—నల్గురూ—వుంటే ఇప్పుడేమైంది మావా?

మగ (వ) : చెప్పుతాగా—వినూ...మరీ !

మ్యూజిక్ — నృత్యం :

మగ (పా) : ఏటేట-పిల్లలతో-ఒల్లంతా గుల్లాయె (2)
మందులకు—మాకులకు—ఊరంతా అప్పాయె (2)
సాలి, సాలని కూలి-సాపాటుకు సాలదాయె (2)
కడుపునిండ కూడు—వంటినిండ గుడ్డ ఏనాడు
కట్టామొ - రంగమ్మొ - ఇల్లు పిల్లలసంతాయెనే
రంగమ్మా (2)

ఆడ (వ) : ఛీ...ఛీ ! అదేం మాట మావా ! పిల్లల్లే నిల్లు దేవుడులేని గుడిగా ఉండదూ...?

మగ (వ) : అసలే పిల్ల లొద్దంటం లేదుగా ! ఇద్దరైతే మనకి చాలన్న—

ఆడ (వ) : అయితే, మనకిప్పుడేం తక్కువైం దంటావు మావా !

మగ (వ) : తక్కువై యుందేంటో సెప్పనా ? వినూ—

మ్యూజిక్-(నృత్యం)—

మగ (పాట) : కాపురానికొచ్చాక - కల్సిందామా ! మనం
సిల్కా—గోరింకల్లా—తిరిగొచ్చామా ! (2)

ఆడ :  ఉ_హూ

మగ (పాట) :  కాపురాని కొచ్చాక - కల్సిందామా మనం
సిల్కా గోరింకల్లా - తిరిగొచ్చామా !
ఏ పేట బిడ్డాయె - ఈ ఏడు నలుగురాయె
ఇరుగమ్మ ఎంకమ్మ - పొరుగింటి పుల్లమ్మ
ఎంచక్క జంటలుగ - పోతుంటే వాళ్ళు

ఆడ (వ) :  ఏ వైంది వాళ్ళకి ?

మగ (పాట) :  ఎంచక్కా జంటలగ పోతుంటే వాళ్ళు
సూడా ముచ్చాటాయె రంగమ్మో
చూసి వద్దామె ఇద్దరము - రంగమ్మో రాయె
సిల్మొ చూసొద్దాము - రంగమ్మా! (2)

ఆడ :  ఒహో - అదా సంగతీ !

మ్యూజిక్ - డాన్సు :

ఆడ (పాట) :  ఇరగమ్మకి - ఇద్ద రేగ - పుల్లమ్మకి
ఒక్కరేగ మావా (2)
పిల్లా జల్లా - తక్కువాయ - పనీపాటులేదయ్యో 2

మగ :  ఊ

ఆడ :  ఎంచక్కా ఉరంతా _ తిరిగొత్తారు.
వాళ్ళు ఎనైన్నా - సి ల్మొ లు చూ సొత్తారు (2)
వాళ్ళతో పొత్తేంది మావయ్యా - వాళ్ళతో
పొత్తేంది మావయ్యో, మనది పిల్లలు గల ఇల్లయ్యా
మావయ్య-మనది పిల్లలుగల యిల్లయ్యా మావయ్య ॥

మగ (వ) : ఆ... అందుకే చెప్పింది మరీ-ఇద్దరు తర్వాత ఆ గవరమెంటోళ్ళు చెప్పిన-ఆపరేషన్ చేయించుకోమని!

ఆడ (వ) : ఎప్పుడు సెప్పావు మావా నాకూ... గురుతులేదు.

మ్యూజిక్ :

మ (పా) : ఆనాడే చెప్పాను ఇద్దరుంటే చాలని
యినకుండా కన్నావు—ఈనాడు నలుగురిని
నారుపోసి నోడె – నీరుపోయునన్నావు
యిన్నావా నామాట రంగమ్మా – ఇప్పుడైన
తెలిసిందా రంగమ్మ – కళ్ళు యిప్పుడైన
యిప్పాలి రంగమ్మ !—

ఆడ (వ) : అయితే నాకు తెలవకడుగుతా గానీ-పిల్లలెక్కువుంటే ఏంది మావా నట్టం ?

మగ (వ) : అబ్బో...అబ్బో-బోలెడంత నట్టం మనకీ—మన దేశానికీ...

ఆడ (వ) : బలే సెప్పావులె - మా గొప్పగ - మనకి పిల్ల లెక్కువుంటే – దేశానికేం నట్టమంటా ?...ని.

మగ (వ) : ఆ...ఏం నట్టమా ? ఇది కూడా విను...మరీ.

మ్యూజిక్ :

మ (పా) : రైళ్ళల్లో రద్ది చూడు-బస్సులోకి క్యూలు జూడు
కిరసనాయిలు కాడ జూడు-సినీమాల జోరు చూడు
సందుల్లో - గొందుల్లో - బజార్లలో - కొట్టల్లో

భుజం భుజం తగులుకొని-అటూ ఇటూ నెట్టుకొని
తోపులాట-తన్నులాట-సిటీబసులో-పోట్లాట
ఆడ-మగ-తేడ లేక-అతుక్కు-నీ-ఎక్కు-తుంటే!

(2) సూట్టంలేదా ! రంగమ్మ-జనం ఎంత పెరుగు
తున్నదీ రంగమ్మా— (2) సార్లు

ఆడ (వ) : అవునవునూ ... నిజమే మావా ! మొన్న-సిటీ
బస్సులో - ఆ సచ్చినోడెవడో - నన్ను తోస్కు-ని
ఎక్కే-డు మావా-చీ-పాడు...

మగ (వ) : అదేను ? ... యింకా చెప్పుతా చూడు.

ఆడ (వ) : ఏదీ ఎట్టా చెప్పూ... ?

మగ (పా) : ఇట్టాగే-ఈ జనం పెరుగుతూ వుంటేను

ఆడ : అ...ఉంటే

మగ (పా) : చోటైన వుండదే రంగమ్మో !

ఆడ : అమ్మో - !

మగ (పా) : పీల్చే గాలుండదే రంగమ్మో (2)

ఆడ : బాబోయ్... !

మగ (పా) : భారత దేశమే చాలదే రంగమ్మా ! (2)

ఆడ : అయితే యింకెట్టా మరీ!

మగ (పా) : అందుకే మనమింక రంగమ్మా !

ఆడ (వచ) : ఏం... చేద్దాం ?

మగ (పాట) : ఒక్కమాట - పలకాలి రంగమ్మా !

ఆడ (వ) : సరే...

మగ (పాట) : అందుకే మనమింక రంగమ్మో
: ఒక్కమాట పలకాలి రంగమ్మో - మనం
ఒక్కబాట నడవాలి రంగమ్మా (2)

మగ : ఏ మంటావ్... !

ఆడ (వచ) : అట్టాగే నడుద్దాం !

మ్యూజిక్ :

ఆడ (పాట) : చేసింది తప్పైనని - చెంపలేసుకుంటాను
చేయూత - నిత్తాను మావయ్యో - నీమాటే
యింటాను - మామయ్యో... (2)

మగ (వచ) : అయితే అందరితో జెబుదామా ?

ఆడ (వచ) : ఓ పదా చెపుదాం.

ఇద్దరు కల్సి పాట :

అందరితో ఈ మాట - అటుబోయి చెబుదాము !
కొందరితో మన మాట - ఇటుబోయి చెబుదాము !
ఇద్దరు పిల్లల కంటే - ఎక్కువే వద్దనీ - వద్దనీ - వద్దనీ
అందరితో చెబుదాము - మావయ్యా - సిల్మా చూసి
మళ్ళొద్దాము రావయ్య [2] సార్లు.

ఇద్దరూ కలసి పాట :

అయ్యల్లార - అమ్మల్లార
యిన్నారా – ఈ మాట
యిన్నారా – మా మాట
(2) గంపెడు పిల్లలు – వుంటే మీకు
గంజినీలే దొరకవు - మీకు - అ–అ–అ–అ-
(2) ఇద్దరు పిల్లలు - వుంటే మీకు ఇల్లంతా
పండగే - అహో ఇల్లంతా పండగే (2)
అహ పండగే - అహ పండగే
అహ పండగే - అహ పండగే
పండగే - పండగే - పండగే ॥

# చిన్న కుటుంబము

అందమైన గులాబీ - పూలు మాకు రెండు
ఆ రెండే పూసినవీ - ఇంటి ముందు మాకు

అందమైన ఆ పూలే - చిందించు పరిమళం
అందించు మాకు అవి - ఆనంద డోలలు

ఇంటి కెంత అందమో - ఆ పూలే రెండు
మా కంటిని వెలిగించే - చిరు దివ్వెలు రెండు

ఉదయ కాంతి వెలుగులో - మెలమెలా మెరయును
ప్రగతి కాంతి వెలుగులో - పసిడి మాకు కురియును

భావి బ్రతుకు బాటలో - బరువు మాకు ఉండదు
నిండుకుండ మాదిరి - ఉండు మాకు భాగ్యము.

# ధన్యజీవి గురువు

## ( ఉదయ వేళ )

కిల కిల ధ్వనులు - ప్రతిధ్వనింప
పక్షులు రావంబులు - పల్కుచుండ
భక్తుడొకడు లేచి - దైవ సన్నిధిన్ నిలచి
చిత్తంబున పూజలేవేవో - సల్పుచుండ
పగలు ఎపుడాయని - సకల చరంబులు
మానసము నెంతో - సంబరమొందుచుండ !

అలసిన శ్రమజీవుల - కల్పు తీరుచు నుండ !
అలిగిన యిల్లాలు కపుడె - అల్క తీరగనుండ
అశువుల్ బాసిన కొందరి ఆత్మబందుగులకు
ఉప్పొంగెడి కన్నీటి ధార - లాగిపోవుచునుండ
మరచి నిదురించు మనుజుల - మేల్కొలపంగ
వేయి కిరణములు దాల్చెనే - దివకరుండు !

అట్టి తరి అల్లిన చీకట్లు - చెల్ల చెదురగుచుండ
అల్లంత దూరాన అరమోడ్చిన కన్నుల వోలె
అరుణోదయంబగుచు - జగములన్ వెలిగింప
ఉదయమగుచుండె - భాస్కరుడు తూరుపు దిశలో !

లేచినమ్మకు వేళ - చాల నిలిచిపోయె !
వృద్ధ మాతకు నిదురింక - తేలదయ్యె
పాలు త్రాగెడి " పాప " పక్క నెతుకుచునుండె !
" అమ్మ " లేదా యనుచు " కసిగ " ఏడ్చుచుండె !

అక్కడక్కడ పల్కు - చీపురుల సవ్వడి చేత
అల్లిబిల్లిగ లోకము - గజిబిజిగ నుండ
అంతలోనె విన్పించె - రచ్చలోన
ఆరుగంటలన్ కొట్టిరే — అనుదినచర్యగాను !

అట్టి శుభవేళ - అకాశవాణిలో దేశభక్తిని దెల్ప
మధుర గాయకుల్ పాడిరే - " వందేమాతరం "
వీనులకు విందైన - సంగీతముల తోడ
పాడుచుండిరి భక్తితో - భక్తిరంజనిలో !

అట్టి తరి గంటలన్ విని గురువు - గతుకుమని లేచి
కాలమయ్యె ననుకొనుచు - కంగారు పడుచు
కాలకృత్యములన్నిటిన్ — కలియబెట్టి ఒక్క
తృటిలోనె స్నానమాచరించి-నోటిలోన వేడి "టీ"ని బోసె!

చెక్కు చెదరని జీరంచు - పంచె గట్టి
చుట్టి యున్న తలపాగ - గట్టిగా బెట్టి
వంక కర్రను చేబట్టి - పాదరక్షలన్ దొడగి
పంగనామము లెట్టి - పయనించె పంతులయ్య !

ఎదురగు బుద్ధిగల పెద్ద - లెందరో దండమయా
పంతులుగారు దండమనుచుండ పరవశించుచు
మదిలోనె ప్రతి దండ మిడుచు - గురువు జీవితమెంత
భాగ్యమనుకొనుచు సాగిపోయెను-స్థాయిగా స్థానమునకు !

కంచు వలన బడి గంట - గణ గణ మ్రోగంగ
గుండెలోని బాధ్యత - గుర్తించు కొనుచు
మందహాసముతోడ - మెల్ల మెల్లగ నడచి
స్వచ్ఛమైన శ్వాసతొ - కుర్చీలో చేరబడెనో !

బడి గదికి చేరిన - గురుదేవులన్ గాంచి
గోల చేసెడి బాలలు - గప్‌చిప్‌గ నుండి
ఒక్క గొంతుక చేసి - వందనం బొనరించి
ఒరుసలో నిలబడిరి - ఓర చూపులతోడ !

చిరునవ్వు లొలికించు - చిన్నారి బిడ్డలన్
చూచి చూడక నుండి "సిట్ స్టాండు"ల జెప్పి
సిద్ధపరచిరి క్రమములో - చిరునవ్వుతోడ
పాఠాలు జెప్పంగ - ప్రారంభమున్ జేసె పంతులయ్య!

మాతృభాషయైన - తెలుగుభాషలో !
కమ్మనైన మాట - అమ్మమాట "అమ్మ,"
అను మాటతో చదువు - నారంభమున్ జేసి
కమ్మనైన కథ, పాట, లాట, గణితమున్ నేర్పిరే
గురువుగారు !

అమ్మ నెడబాయనట్టి - ఆరు వర్షాల బిడ్డలన్
అమ్మ రీతినె ప్రేమించి - అ, ఆ, లు దిద్దించి
తప్పు ఒప్పులన్ తాల్మితొ - సవరించుకొనుచు
తీర్చిదిద్దితివయ్య గురువా ! - తేటతెల్లముగ !

నేటి బాలలన్ రేపటి - పౌరులన్ జేసి
చదువు సంస్కారముల్ దెల్పి - చక్కటి కవితలన్ జేసి
దేశ మేలునట్టి రాజకీయులన్ - జేసిన, నిన్ను
"గురువు" దైవంబులను - మాట తథ్యమే గదా !

మొండి, బండ అనుకోనకుండ - అక్షరములన్ నేర్పి
అష్ట, కష్టములన్ బొంది - ఐదు రూప్యములైనన్
ఆదర్శముగ నిలచి - అజ్ఞానమును బాపిన
అట్టి నీవు జ్ఞానమును బోధింప-దిగివచ్చిన దైవంబు గాదా !

నీవు నేర్పిన విద్యయే - నేటి విద్యాధికారులు
నీవు నేర్పిన విద్యయే - అరుగో నేటి డి. ఐ. గారు
నీవు నేర్పిన విద్యయే - నేటి రాజ్యాధికారులు
వారు వీరని ఏల జెప్పెద - అందరు నీకడ విద్య గరిపిన
అయ్యలే గదా !

ధన్యజీవివయ్యా గురువా ! ధరణిలోన
గద్దె దిగినను మిగిలింది - సుకీర్తియే గాదా !
చెరగనిది, తరగనిది - శాశ్వితమైనది
గురువను బిరుదుయే - నీకు చెరగనిది గురువా !

# మానవుని దశలు

పది నెలలు దాగి – మాతృ గర్భము నందు
మాయ లోకము - జూడ ముసుగు నుండీ
పాప పుణ్యము లెరుగక - పుడమి పైన
పుట్టితి ఒకనాడు నీవు - పసికందుగాను !

పుట్టిన నిను జూచి – తల్లి మురిసిపోయె
ప్రేమ మీరగ - పాలిచ్చి పెంచెనాడు.
పాల బుగ్గల తోటి – నుదుట ముంగురుల తోడ
ప్రాకులాడగ నేర్చితివో - పసిడిబాల !

ముద్దు లొల్కు నీ మోము - చూడ ముద్దువచ్చి
ముద్దాడు నీ తల్లి దండ్రి - ముత్తైదులంత
ముచ్చటైన నీదు - పాల బుగ్గల నిగ్గు
మీగడను బోలు నీ మేను – నునుపు బాల !

పసి పాప నీలోనె - పరమాత్మ నివశించు
దైవ రూపమె నీలోన - గానవచ్చు.
పాపమెరుగని పాప - బంగారుపాప
పాలు త్రాగెడు ప్రాయమెంత - భాగ్యమయ్యా !

తప్పు లైనను మాటలు "తాత" అత్తలనుచు
మాటలాడగ నేర్చె - మన ముద్దు పాప
అల్లి బిల్లిగ చిలుక పల్కు - లాడినపుడు
అందంబు జూడ - చందమామను బోలు!

ఐదు వత్సరంబులు - దాటె నందాల పాపకు
ఆట లాడు ఈడు - అరంభమయ్యె
అభ్యసించగ విద్య - గురువుల యొద్ద
అచటి కేగెను బాల - శైశవ దశను వీడి !

బాధ్యతెరుంగక - బ్రతుకు భారమెరుంగక
బాల్య దశ నీకు - ఎంత సౌభాగ్యమయ్యె
చింతలేని బ్రతుకు - స్వార్థంబు లేనిదై
చిట్టి పిడతల బొమ్మలాటయే చింత నీకు ॥

చిలిపి చేష్టల వయసు - చిన్నారి వయస్సు
చదువు సంధ్యల వయస్సు - స్నేహపూరిత వయస్సు
భావి భారత బాల - వీరుడవనిపించుకొన
భావికాలవు బ్రతుకుకై - బ్రాకులాడెడి బాల !

ఆటలాడెడి నీ బాలప్రాయంబు నుండి !
కదలి పోయెను - కాల మెంత త్వరగ
కనులకింపగుచూడ - సౌందర్యము నిన్ను
వరియించెనన్నట్లు - వచ్చిపడెనాహా యౌవ్వనంబు !

ఒంపు సొంపు లెదిగి - వలపు తలపుగ మారి
పెండ్లి యీడు వచ్చి - మనసు పెండ్లాడగోరె
కన్నె ప్రాయము కంత - రాయంబు గలుగ
కోరి తెచ్చుకున్న - కష్టాల కోడె వయస్సు !

కోర మీస మెదిగి - కోరిక లూరె
కోడెనాగు బోలు - కామక్రోధంబు పెరిగి
కానవైతివి నీ వింత – పాపభీతి లేక
కర్త వైతివీ లోక - కార్యములకు !

తల్లి కాయు రీతి - దైవంబు నిన్ను
ఇన్నాళ్ళు కాచె నీ లోనె నిల్చి యుండి
కాని పాప మెదిగిన - నీ యందు నీతి లేదని
పారిపోయెను దైవంబు – పరమపురికి !

చావు పుట్టుకలు మరచి - చక్కగాను
సాగుచుండెడి - సంసార జీవితములో
కాలసర్పము జూచి - కాటువేయగ నెంచి
పొంచి దాగిన వృద్ధాప్యము - వచ్చిపడెనోహో!

తుమ్మెదబోలు నీ జుట్టు - చూడ ఏకుల బుట్ట
బిగువైన నీ మోము - బక్కచిక్కిపోయె
వరుస తక్కువగాని - చక్కని పలువరసలో
అక్కడక్కడ వెలుతురు - అయ్యో నేల!

కండలెదిగిన కాయంబు - గంగడోలుగ మారి
కాలి సత్తువ లుడిగి - కళ్ళ దృష్టియు పోయె
నిడివైన నీ నడుము - నేల కొరిగిపోగ
నిలువ కర్రతో, మూడు కాళ్ళ-గల్గిన ముసలి తాత!

మూతి మీసము మెలిచి - మొనగాడివనిపించు!
నిన్న మొన్నటిదాక - ప్రజలు నిన్నెను కొనగ
అంతటి నిను గన్న - చిలిపి బాలలు నేడు!
తాత, తాతా యనుచు - నిన్ను గేళి చేయ!

గేళి వినగనె నీకు - రోషంబు నింగి కెక్కి
బోసి నోటితో గొణిగి — యేవేవో వూసులాడి
చేయునది లేక చేయూత కర్ర ఆసరి
సాగిపోదువు ముందుకు - సద్దులేక !
అపుడె నిండెనయ్యా - నీ కరువదేండ్లనుచు
అంతలోనె సంధించె - నిన్ను మరణదూత
శక్తిహీనమైన నీ వింక - చేయునది లేక,
సాగిపోదు వెంత సులభముగ - సారధి వెంట !

పుట్టిన నాడు నిన్నెంత - పూజించి రంత
గిట్టిన యీ నాడు నిన్నింట - నిముషముంచరంత
అకట, కట కట కట్టెలపైన - కట్టెద రెంత వింత
ఎట్టి రీతిగ - ఒంటిగ వచ్చినావో -
అట్టి రీతిగపోవునే మనుజ జన్మ !
మట్టి బొమ్మను జేసి - దైవంబు జీవాత్మ నిచ్చి
మంచి చెడ్డలు దెల్పనీకు — జ్ఞానేంద్రియముల నొసగి
పాప పుణ్యములు గెల్వ - ఈ లోక పందెంబు బెట్టె
ఏది గెల్చిన దిలలోన ఎరుగలేవు - అచట కేగిన ఫలిత
మరయ గలవు.

0o0